శ్రీరస్తు

# దేవకీనందనశతకము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచే

ప్రకటితము.

1934

శ్రీ కృష్ణాయ నమః.

# దే వ కీ నం ద న శ త క ము.

శా. శ్రీకైవల్యరమాధినాథ నిను నర్థిం గీర్తనల్ జేసి కా
దా కంజాతభవేంద్రనారదశుకవ్యాసాంబరీషార్జునుల్
నీకారుణ్యముఁ గాంచుటల్ ననుమతిన్ నేనెంతధన్యుండనో
నాకుఁ జేకురె నట్టిభాగ్యములు కృష్ణా దేవకీనందనా. 1

శా. శ్రీవైకుంఠనివాస గోత్రధర లక్ష్మీనాథ గోపాల లీ
లావిర్భావ పతంగవాహ యదువంశాంభోధిచంద్రోదయా
నీవే దిక్కని యున్నవాఁడను దయన్ వీక్షించి రక్షించవే
నావిజ్ఞాపన మాలకించు మది కృ... 2

శా. శ్రీరామావసుధాకళత్రములపైఁ జెన్నొందుపాదాబ్జముల్
గారామారఁగఁ జూచి శేషఫణిదాఁ గౌతూహలంబొప్పఁగా
క్షీరాంభోనిధిఁ బవ్వళించి యమరుల్ సేవింపఁగా నొప్పుని
న్నారాధింతు మదీయచిత్తమునఁ గృ... 3

శా. నీడల్ దేఱెడు చెక్కుటద్దములతో నిద్దంపుఁ గెమ్మోవితో
కూడీకూడనిచిన్నికూకటులతో గోపార్భకశ్రేణితో
క్రీడాశూన్యకటీరమండలముతో వేడ్కన్ వినోదించుచు
న్నాఁడా శైశవమూర్తి నేఁ దలఁతుఁ గృ... 4

శా. అందెల్ చిన్ని పసిండిగజ్జియలుమ్రోయన్ మేఖలాఘంటికల్
క్రందైమ్రోయఁగ రావి రేకనుదుటన్ గంపింపగోపాళికల్
వందారుల్ గన వెన్నముద్దలకునై వర్తించుమీబాల్యపుం
జందం బాదివిజుల్ నుతించుటలు కృష్ణా దేవకీనందనా. 5

శా. వేదోద్ధారకుఁగా సుధాప్రభవుఁగా విశ్వంభరావాహుఁగా
వాదావిర్భవుఁగా త్రయీవటువుఁగా వర్ధిష్ణుతాయుష్యుఁగా
కోదండాశుగపాణిఁగా బలునిఁగా ఘోరవ్రతచ్ఛేదిఁగా
నాదిబ్రహ్మముఁగాఁ దలంతు మదిఁ కృ... 6

మ. అమరుల్ స్తోత్రికులచే మునుల్ నుతులచే నార్యుల్ మహానిష్ఠచే
సమరోత్సాహజనుల్ పునశ్చరణచే సాధుల్ దయాబోధచే
నమితోదారకళాఢ్యు లర్పణలచే నధ్యాత్ము లైక్యంబుచే
సమతం గాంచిరి మీపదాబ్జములు కృ... 7

మ. జపముల్ సేయఁగ నేర నీమమున నిచ్చల్ పూజ సేయంగ
లేనుపవాసవ్రతభక్తిచొప్పెఱుఁగ వేదోక్తక్రమస్థుండఁగా
నపరాధంబులు నాయెడం దలఁచు నే నజ్ఞాని నెబ్భంగులన్
జపలుం డంచు నుపేక్ష సేయకుము కృ... 8

మ. సుకరంబై సురసేవ్యమై సులభమై సువ్యక్తమై యుక్తమై
ప్రకటంబై పరమార్థమై ప్రమదమై ప్రద్యోతమై పథ్యమై
యకలంకామృతమై యమోఘతరమైయానందమైయందమై
సకలంబున్ భరియించుమీమహిమ కృ... 9

శా. కొండల్వంటికవీశ్వరుల్ శతకముల్ గూర్పంగఁ గోటానకో
ట్లుండన్ నీవును జెప్పఁబూనితి వదేమో యంటివా వింటివా
వండేనేర్పులఁ బెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకముల్
దండిన్ నామన వాలకింపు మదిఁ గృ... 10

శా. చన్నే నిన్నును బాలుఁగాఁ దలఁచి యిచ్చెం బూతనాకాంత దాఁ
జన్నుల్ నిండఁగఁ జేఁదుఁ బూసికొని యాచన్నాలు నీకిచ్చినం
జన్నుం బాలకులోనుగాక యసున్ సాధించి యాయింతికిన్
సన్నన్ ముక్తి యొసంగి తీవు భళి కృష్ణా దేవకీనందనా.

మ. విలసిల్లన్ పదియాఱు వేల సతులన్ వీక్షించి వారిండ్లలో
పల వర్తించుచు నుండి వీటఁ గలగోపస్త్రీలనెల్లన్ గడుం
బలిమిన్ బట్టి రమించినాఁడవు భళీ ప్రాజ్ఞుండ వీ వౌదు భూ
స్థలి నీవేకద కొంటెదేవరవు కృ... 12

మ. పాలుపొందన్ నడిరేయిఁ గుక్కుటరవంబుల్ చూపి గోపాల
కా,వళి విభ్రాంతులఁ జేసి మందలకునై వారేఁగఁ దత్కా
మినీ, కలనాయత్నము తామ్రుచూడగతులన్ గావించి
నీకీర్తి ర,చ్చల కెక్కెం గదు గొయ్యదేవరవు కృ... 13

మ. అనిరుద్ధాచ్యుత యీశ కేశవ ముకుందాధోక్షజోపేంద్ర వా
మన దామోదర చక్రపాణి హరి రామా శౌరి శార్ఙ్గీ జనా
ర్దన పీతాంబర భక్తవత్సల నమో దైత్యారి వైకుంఠ వా
స నృసింహాంబుజనాభ ప్రోవు ననుఁ గృ... 14

మ. ఇల గోవర్ధన మెత్తితీ వనుచు బ్రహ్మేంద్రాదు లెంతో ని
నుం,బలుమాఱు నుతులొప్పఁ జేసెదరు పద్మాక్షా కుచాగ్రం
బునం,జులకన్నెత్తిన రాధ నెన్న రిదిగో సొంపొంద సత్కీర్తి
ని,శ్చలపుణ్యంబునఁ గాక చొప్పడునె కృ... 15

శా. మౌళిం బింఛపుదండ యొప్పఁగ నటింపంగాను శృంగార
పున్,శ్రీ లెంచంగను పిల్లఁగ్రోవిరవమున్ జేకోలమున్ జె
క్కుచున్,గేలన్ మెచ్చొనరింపఁ గోపకులతోఁ గ్రీడార
సస్ఫూర్తి నీ,వాలం గాచువిధంబు నేఁ దలఁతుఁ గృ... 16

శా. పెచ్చుల్ ప్రేలుచుఁ బిల్లఁగ్రోవిరవముల్ బెంపొందఁగాఁ జొక్కు
చున్, నిచ్చల్ నిన్ను భజింప గోపగణముల్ నిత్యోత్సవక్రీడ
మై, నెచ్చల్ మచ్చికముచ్చటచ్చుపడఁగా హెచ్చించి కీర్తించి
నీ, సచ్చారిత్రము విన్నఁ బుణ్యమగుఁ గృష్ణా దేవకీనందనా.

మ. లలనాకుంచితవేణియుం బడవ మొల్లల్ జాజి కస్తూరికా
తిలకంబుం గఱఁగంగ లేఁతనగవుల్ దీపింప నెమ్మోమునన్
దళుకుల్ చూపెడిచూపు లుల్లసిల నానారీతులన్ వేణుపు
ష్కలనాదంబుల పెంపుఁ జూపుదువు కృ... 18

మ. కలకాంచీమణికింకిణీమధురనిక్వాణంబు మంజీరమం
జులరావంబును గొంతకొంత వినవచ్చెన్ బట్ట లేనైతి నం
కిలి నిద్రించుట మోసపుచ్చె హితవాగ్గేయుండు నేఁడంచు ని
చ్చలు మీశౌర్యము లెంచు గోపతతి కృ... 19

మ. కలనైనన్ నగియైనఁ గోప మెసఁగంగానైన మీనామని
ర్మలవర్ణద్వయ మెవ్వరేఁ బలఁచినం బాపౌఘముల్వాయును
జ్జ్వలభాస్వత్ప్రతిమానచండకిరణవ్రాతాహతిం జీఁకటుల్
చలనం బందు తొలంగుచందమునఁ గృ... 20

మ. నినునెవ్వాఁడు దలంచు నీమహిమ వర్ణింపంగ నెవ్వాఁడు నే
ర్పునఁ బూనున్ నినుగొల్చునట్టిఘనుఁడా పుణ్యాత్ముల్లోకైక
మాన్యునిఁగా ధన్యునిఁగా వివేకనిధిఁగా సుదృగ్గుణాం
భోధిఁగా, ననిశంబుం గొనియాడఁ గోరుదురు కృ... 21

శా. శీలంబున్ గులమున్ వివేకనిధి లక్ష్మీకాంతవక్షస్స్థలిన్
పాళింబాయకయుండు కాముకుఁడవై హంకారవృత్తిన్ స
దా, స్త్రీలోలుండన రాధతోఁ బెనఁగుటల్ చిత్రంబులు న్నా
ర నీ, జాలం బే మని సన్నుతించెదను కృ... 22

శా. శ్రీలక్ష్మీధవ రుక్మిణిం గలసి కూర్మిన్ మిత్రవిందా సుదం
తాలోలాత్ములఁ గూడి జాంబవతి సత్యాలక్షణాభద్రలన్
కాళిందిన్ మరుకేళిఁ దేల్చితివి శృంగారాంగగోపాంగనా
జాలంబున్ దనియింతు వౌర తుదఁ గృష్ణా దేవకీనందనా.

శా. మద్దు ల్గూల్చినలాగొ వేగ మనిలో మన్నించి గాండీవికిన్
బుద్ధుల్ సెప్పినలాగొ మోదరసముప్పొంగన్ యశోదమ్మకున్
ముద్దుల్గా నటియించులాగొ వరుసన్ మువ్వేళలన్ వేడుకన్
చద్దు ల్మెక్కి రహించులాగొ ధరఁ గృ... 24

మ. చరణాబ్జంబులు వీడ్వడన్ నిలచి యోజన్ ధట్టిలో పిల్లఁ
గ్రోల్,కర మొప్పారఁగ నుంచి యుంపాదవఁ జంకన్ గోల
నందిచ్చి బల్వరుగోపాలురు జుట్టునుం గొలువ వేల్పుల్ గ్రు
క్కిళుల్మ్రింగఁగా,నరయం జల్ది భుజింపవే యడవిఁ గృ...

మ. మెఱుఁగు ల్దేఱుమహేంద్రనీలనిభమౌ మేనన్ సమీపా
టగో,ఖురనిర్ఘాతధరాపరాగలవపంక్తు ల్గప్పఁగా నొక్కచేఁ
బురిగోలొక్కటఁ బాలకుండఁగొనుచుం బొల్పొంగ గోధుగ్జ
నాం,తరవర్తిష్ణుఁడ వైన నిన్ గొలుతుఁ గృ... 26

శా. ఆధివ్యాధిహరంబు జన్మమరణవ్యాపారదుష్కర్మదు
ర్బోధావ్యాప్తినివారణంబు సతతస్ఫూర్జజ్జగద్రక్షణో
న్మాథాయుక్తము భక్తవాంఛితఫలానీకప్రథానైకదీ
క్షాధారేయము నీమహామహిమ కృ... 27

శా. హాలాహాలశిరోధిమాలినయనోద్యద్భీమధూమధ్వజ
జ్వాలాభీలకరాళరూక్షవిషనిశ్వాసోష్ణకృష్ణానదాం
భోలీలాస్పదకాళియస్ఫుటనటద్భోగాగ్రమధ్యంబునన్
హేళిన్ దాండవమాడు నిన్ దలఁతుఁ గృ... 28

మ. తినదే చెట్టున నాకు మేఁక గుహఁ గొందిం బాము నిద్రింపదే
వనవాసంబునఁ బక్షులున్ మృగములున్ వర్తింపవే నీటిలోఁ
మునుకల్ వేయవె మత్స్యకచ్ఛపములున్మోక్షార్థమా ముక్తికిన్
మనసే మూలము నీదుభక్తులకు కృష్ణా దేవకీనందనా. 29

శా. వింటిం గొంతగ మీమహత్త్వమును సుర్వీన్ దర్శనప్రాప్తిచే
ఘంటాకర్ణుని నుగ్రసేనతనయుం గైవల్యతేజంబు ని
న్నంటంజేయవె మాటమాత్రమునని ట్లాశ్చర్యమున్ బొం
దఁగా, నంటం బొందనివేల్పు నిన్ గొలుతుఁ గృ... 30

మ విలసత్కావ్యకళాధురీణతలు తజ్జ్ఞానులై నట్టివే
త్తలకుం గాకవి యేల మూర్ఖులకు గాథల్ జెందు భాగీరథీ
దళితాంభోరుహషండమండితమరందగ్రాసమాధుర్యవాం
ఛలు జోరీఁగల కేల తేంట్లగతి కృ... 31

మ. చతురంభోధిపరీతభూవలయరాజానేకకోటీరరం
జితమాణిక్యవిరాజమానపదరాజీవుండు ధర్మాత్మజుం
డతికారుణ్యముచేత మత్స్యపతికొ ల్వాసింపఁడే నీదుశా
శ్వతకారుణ్యము గల్గునంతకును కృ... 32

మ. శుకమద్గౌతమకణ్వకుత్సజమదగ్న్యదంకశాండిల్యశౌ
నకపారాశరకశ్యపాత్రిఘటజాహేంద్రప్రభూతత్రయం
బకకంజోద్భవనారదాదిమునిహృత్పంకేజసౌమ్యత్విషా
సకృపాసాగర నీకు మ్రొక్కెదను కృ... 33

మ. వివిధోగ్రస్థవనప్రచండబలవిద్వేషావనీనాయకో
త్సవభంజీకృతశాలి యర్జునుఁడు దోస్సత్త్వాఢ్యుఁడు మత్స్యావనీ
ధవుగేహంబున నాట్యశాలధరియై తా నిల్వఁడే సన్ముని
స్తవ నీసత్కృప గల్గునంతకును కృ... 34

మ. బలభేది న్నలయించి ఖాండవవనిన్ భస్మంబు గావించి ము
న్నేలమిన్ దైత్యులఁద్రుంచియొక్కటిశివున్నిర్జించి కౌరవ్యు
లన్,బలి గావించి కిరీటి బోయలకు గోపస్త్రీల నొప్పింపఁడే
యల నీతేజము నీవు గైకొనినఁ గృష్ణా దేవకీనందనా. 35

మ. ఇలఁ దద్వైరినృపాలఫాలఫలకప్రత్యగ్రరక్తచ్ఛటా
కలితోదారగదావిజృంభణభుజాగర్వుండు భీముండు కు
క్కలకుం జూపఁడె యేకచక్రపురిభిక్షావేళ యుష్మత్సము
జ్జ్వలకారుణ్యము గల్గునంతకును కృ... 36

మ. అతిసౌందర్యసమగ్రధైర్యఘనశౌర్యస్ఫూర్తియున్ గీర్తియు
న్నతులప్రాభవరేఖయున్ గలిగి చోద్యంబెన్నఁగా ఘోటక
ప్రతతిం దిద్దఁడె నిత్యమున్ నకులుఁ డేపారంగ నీసత్కృపన్
సతమై రాజ్యము గల్గునంతకును కృ... 37

మ. బకదైతేయమహాబలున్ సమరభూభాగంబునన్ వాయుపు
త్రకుఁ డీల్గించిన నేకచక్రపురివారల్ మెచ్చి యింటింట వం
టకము ల్బెట్టిరిగానిభిక్షుయనుమాటన్ మాన్పలేరైరి యం
తకు వారల్ గొలఁదేమి చాలుటకుఁ గృ... 38

మ. గహనావాసములోన నన్నలకుఁ దా గారాబుతమ్ముండునై
విహరించేతఱి భావికాలగతి నన్వేషించుచున్ శౌర్యసం
గ్రహుఁడై యావులఁగాచెమత్స్యపురిలోఁగర్మానుగుణ్యక్రి
య,న్సహదేవుం డతిధైర్యమార్గమునఁ గృ... 39

మ. వినుతానేకతురంగవారణరథోర్వీనాథదివ్యాన్నికే
తనచక్రధ్వజచామరప్రథిమతోఁ దథ్యాత్ముఁడౌ నాసుయో
ధనుఁ డేకాకియుఁబాదచారియునునై దర్పంబువోనాడి పో
యెను మిమ్మెట్టుఁ దలంచి చూడకయ కృ... 40

శా. రక్షింపం దగువీరుఁ డెవ్వఁ డననీరాజుల్ వృథా తేజులే
మోక్షశ్రీయొసఁగన్ విభుండెవఁడుశ్రీమోహాకృతి న్దేవతల్,
రక్షోజాక్ష శుభ ప్రధానగరిమన్ రాజిల్లురాజేంద్రులన్
సాక్షాద్బ్రహ్మము నీవె ధన్యులకుఁ గృష్ణా దేవకీనందనా.

మ. కొలిచేదిన్ వగ లేకనే నడిగితే కోపించు టీ లేకనే
చెలువం బెచ్చుటకోటనేవిభవముల్ చేకూరుటల్ లేకనే
బలవంతుం డగుమూకనే సతిచెదున్ ప్రాణేశు పైఁ గోపనే
జలదశ్యామలశంఖచక్రధర కృ... 42

మ. బలశౌర్యోన్నతి శత్రులం గెలిచి సప్తద్వీపవిశ్వంభరా
స్థలి నేలించి సమస్తవైభవములన్ సేవించి దిక్పాలకా
వళి కీర్తింప మెలంగునైషధుఁడు దా వర్తింపఁడే తొల్లి వం
టలవాఁడై ఋతుపర్ణుచెంగటను కృ... 43

మ. ధరలో గోళకుఁ డైనపాండునికళత్రం బందు వేశ్యాఅనే
పురకున్ బుట్టినపాండునందనులు దివ్యు లైచ్చ వర్తింపఁ ద
చ్చరితం బంతయు భారతంబని ప్రశస్తంబయ్యె నీనామసం
స్మరణప్రౌఢిమఁ గాదె యీఘనత కృ... 44

మ. క్రతువుల్ నూఱొనరించి యింద్రపదవిన్గర్వించిఁయింద్రాణికై
ధృతిఁదూలన్ మదుఁడేచఁగా నహుషుఁడద్దేవేంద్రుభోగా
నుసం, గతిగాఁ గోరినకుంభసంభవుఁడు గిన్కన్ దిట్టినన్
జెందఁడే, సతతంబున్ పెనుబాముచందమును గృ... 45

మ. ఘనులన్ నీచులనీచులన్ ఘనులసత్కారార్హులన్ దుష్క్రి
యాజనితోద్యోగుల నర్థవంతులను భిక్షాయుక్తులన్ భి
క్షులన్, ధనికవ్రాతముగా నొనర్చుచును నిత్యంబున్ మహా
గారడం, బని నందించువినోదరాయ హరి కృ... 46

శా. శ్రీలక్ష్మీధవ వాసుదేవ వరదా రాజీవపద్మాసనా
వ్యాళాధీశ్వరశర్వషణ్ముఖశుకాద్యస్తోత్రసత్పాత్ర గో
పాలానీకముఖాబ్జభాస్కర కృపాపాథోధి నన్ గావుమా
ర్ధాలంకారమయూరపింఛధర కృష్ణా దేవకీనందనా. 47

మ. పతులున్నేవురు నెన్నఁగాఁగలిగి భూపాలాంగనానీకముల్
సతతంబున్ గనుసన్నలన్ మెలఁగుచైశ్వర్యంబుతో నుండి తా
నతిభక్తిం జని యాసుధేష్ణకును జేయం బూనదే ద్రౌపదీ
సతి యాశ్చర్యము నీవిలాసములు కృ... 48

శా. మీసామర్థ్యముగల్గునంతకును నెమ్మిన్ బాండుసూనుండు నా
యాసం బొంద మహాద్భుతంబుగ విరాటాధీశుపట్ణంబులో
గ్రాసోపాయము లేక భిక్షు మడుగన్ గాపాయముం బూనిస
న్న్యాసంబున్ ధరియింపఁడే యచటఁ గృ... 49

మ విరటుం గొల్చినవాఁడునొక్కఁడిలఁ బృథ్వీనాథులన్ గూల్చి
సం,గరభూమిన్ ఘనవైరివీరతతుల న్గారించుచున్ ద్రుంచి
యు,ద్ధరకు న్నగ్రజు రాజుఁ జేసియు తుదిన్ దా నీకృపం
బాయఁడే,సరిపోదే భువి నింద్రసూనుధృతి కృ... 50

మ. అమరు ల్పద్మజువ్రాఁతదాఁటియిపుడొక్కబ్దంబు పెద్దయ్యె
దు,ర్దమదోర్దండపటుప్రతాపనిజసంరంభామరానీకవి
క్రమదుర్వారగజాసురప్రళయ మింకం జేయ ఫాలాక్షునిన్
సమరక్షోణి జయించె నర్జునుఁడు కృ... 51

శా. అక్రూరాత్మకులైనపాండవులబాహాశక్తియున్ ధాత్రి ని
ర్వక్రంబయ్యెడునట్లు జేతు ననుచున్ వాత్సల్య మింపొంద
నా,శక్రాత్మోద్భవు తేరిపై దురమునన్ సారథ్యముం జేసితా
చక్రీ నీమునికోలకున్ జయము కృ... 52

శా. గంభీరంబుగ రాయభారగరిమన్ గొంతేయకార్యార్థమై
శుంభత్క్ష్మాలల ధార్తరాష్ట్రసభఁ దామూహించి తద్వాక్యమే,
ల్సంభాషింపఁగ వా రవజ్ఞ వలఁపన్ సర్వంబు నీవైనచో
శంభుం డేయెఱుఁగున్ భవన్మహిమ కృష్ణా దేవకీనందనా. 53

శా. ఏలా విద్యలు సొంపు రూపవిభవం బేలా కులీనత్వమున్
శీలత్వంబును నేల యేటికి వచశ్శ్రీ యేల బాహాబలం
బేలా చాతురి మీకృపాగరిమ నిక్షేపంబు లేకుండినన్
జాలిం బొందినఁ గల్గునే సిరులు కృ... 54

శా. సర్వజ్ఞుండును సర్వలోకగురుఁడున్ సర్వంసహానాథుఁడున్
సర్వేశుండును సర్వసాధకుఁడునౌ సర్వేశ నీమూర్తి దా
సర్వంబు న్గలిగించు పెంచు నణఁచున్ సందేహ మేలా స్మృతుల్
'సర్వం విష్ణుమయం జగ' త్తనఁగ కృ... 55

మ. పుడమిన్ బెద్దలబోటివారి నడుగం బోరాదె చోద్యంబు
పా,ల్కడలిన్ గల్గినముద్దరాలు గలుగంగా పూర్వకాలంబు
నన్,పాదవెల్లన్ గడుతగ్గి దానవునితో బొంకైనమాటాడి
మూఁ,డడుగు ల్నేలను వేఁడఁగాఁ జనవు కృ... 56

శా. రంగప్రౌఢిమ భార్గవుం గెలిచి కౌరవ్యుల్ భయం బంది వీ
రాంగంబుం ధరియించి జీవము సతంబై యుండ వర్తించునా
గాంగేయుండు శిఖండిచేతఁ దెగె నీకారుణ్యముం దప్పి
యుం,డంగా మృత్యువుధాటి కోపుదురె కృ... 57

శా. అప్రారస్థితి నుండఁగా వలయు రాజాస్థానమధ్యంబునన్
వక్రింపం బనిలేదు ధర్మమునకై వర్తింపఁగాఁ బోయినన్
శుక్రాచార్యుని కన్నుఁ బోనడఁచవే సూటిన్ గుశాగ్రంబు
నన్, జక్రీ నీకరపంకజాంతరముఁ గృ... 85

మ. వరసౌందర్యవివేకధైర్యనయనావాత్సల్యధారేయుఁ డీ
ధరణీనాయకరత్న మంచు మహితార్థం బాశ్రితశ్రేణికిన్
స్థిరసామ్రాజ్యవిభుత్వ మాధ్రువునికిన్ దేజంబుగానిచ్చి తా
సరణిన్ మీకృప గల్గువాఁ డగుట కృష్ణా దేవకీనందనా.

శా. ధారాపూర్వముగాఁగ సంయమికి సప్తద్వీపముల్ సూనృత
ప్రారంభంబున నిచ్చి చేతితడియారన్ లేక వర్తింపఁడే
శారీరార్థ మటంచు భిక్షము హరిశ్చంద్రుండు యాగాదిసం
చారుం డుండు మనండె తొల్లి హరి కృ... 60

మ. పటుబాహాబలసత్త్వవైఖరుల దిక్పాలుల్ ప్రశంసించు నం
తటివాఁడయ్యుఁ ద్రిశంకునందనుఁడు కాంతారత్నమున్ విక్ర
యిం, చుటలున్ నీమహిమంబుచేతఁ గదయిట్లాశ్చర్యమే
మర్త్యాలెం, తటివారైనను నేమిచేసెదరు కృ... 61

మ. తనశౌర్యోన్నతి యుగ్రసాధనముగా తాళాయణీశున్ శి
వున్, దనరన్ మెచ్చఁగఁజేసి లోకముజయస్తంభంబుగావిం
చియున్, మునుదాఁ జేసినకర్మవార్ధిఘనమై ముంపం గదుం
బాలుచేఁ, జనఁడే దుర్మతి విక్రమార్కుఁ డిల కృ... 62

మ. తెగువన్నిర్జరులన్ జయించుచు మదోద్రేకంబునన్ గానలో
మృగనేత్రిన్ ధరణీతనూజ నసురుల్మెచ్చంగఁ దాఁదెచ్చి నె
వ్వగలం బెట్టి విధిప్రయత్నమున నిర్వంశంబుగా రాముచే
జగతిం గూలఁడె యాదశాననుఁడు కృ... 63

మ. పరనారీహరణం బొనర్చినమహాపాపాత్ముఁ డారావణుం
డరయ న్నాతనితమ్ముఁ డైనదనుజుం డత్యంతసద్భక్తితో
శరణన్నం దయఁజూచి యగ్రజునిరాజ్యం బిచ్చి రక్షింప వా
సరణిన్ నీపదభక్తియే ఘనము కృ... 64

మ. వెఱపైనన్ మఱపైనఁ గార్యము తఱిన్ వేసారుచున్నైన
యాఁ,దరమొప్పైననుమాయనైననృపతుల్ దండింపఁగానైన
ననున్,పరిహాసంబుననైనమిమ్మునుడువన్ బ్రాపించుపుణ్యాత్మ
కుల్,నరకావాసముఁజేర రాఘనులు కృష్ణా దేవకీనందనా.

మ. నొసటన్ గన్నులఁ గట్టి వేల్పుపతి నెంతో భక్తితోఁ జూడఁ
గా,నిసుమంతైన భయంబులేక తలమీఁ దెక్కన్నదట్లుండ
నీ,వసుధన్ భర్తను స్త్రీల కెవ్వరయినన్ వశ్యాత్ములై మట్టు
లే,కస మియ్యం దల కెక్క కుందుదురె కృ... 66

మ. కరితో దోమమృగేంద్రుతో నవుఁడు బంగారంబుతోఁ గంచు
భా,స్కరుతో మిణ్గురుబుర్వకల్పకముతోఁ గానుంగు రత్నా
కరే,శ్వరుతో నూషరపల్వలంబు నుత శేషస్వామితో మిత్త
యున్, సరి యైనన్ సరి మీకు దైవములు కృ... 67

మ. నుతలోకప్రతిసృష్టనిర్మలకళానూత్నాబ్జగర్భున్ మహా
ప్రతిభున్ గౌశికుఁ గుక్కమాంసము భుజింపంజేసి మాలాత
నిన్, బతిమాలించవె చండచండతరశుంభత్వంబు పాల్మాలు
నా,శతఁ బొందించవె దేవదేవమయ కృ... 68

మ. వరభోగాధ్వరదానధర్మగుణముల్ వర్జించి తృష్ణారతిన్
నరులత్యంతము మూఢలోభమతులై నారీరతిం గూర్పఁగాఁ
దరముం గానిధనంబు తస్కరవరుల్ ధాత్రీశులుం జేకొనన్
పరఘవ్రాతము జేర్పుతే నెక్రియఁ గృ... 69

మ. ఖలవాక్యప్రతిపాలకుల్ పరధనాకాంక్షుల్ పరస్త్రీరతుల్
కులధర్మౌఘనిబద్ధచిత్తులు నయాకూపారపారంగతుల్
కలుషుల్ రాజులు వారిసేవకులకెల్లం గల్గు నత్యంతని
శ్చలసౌఖ్యంబులు నిన్భజింపఁగను కృ... 70

శా. బొంకు ల్లక్షలు నిత్యసంభరితసంభోగారతుల్ దుర్మదా
హంకారంబులు కోట్లసంఖ్యయగు మోహంబాయనంతంబు
దు,ష్పంకాభార మపార మిన్నిగలభూపవ్రాతసర్వాళిని
శ్శంకం బ్రాజ్ఞులు చేర వోవుదురె కృష్ణా దేవకీనందనా. 71

శా. చీమల్ పుట్టలు పెట్టుచుండ నవి విస్తీర్ణంబు గావించినన్
పాముల్ జేరినరీతి లోభిజనసంపన్నార్థరాసుల్ వృథా
భూమీపాలుల పాలుగాక చనునా పుణ్యంబులే లోల్లరో
సామాన్యంబు ధనాధినాథులకుఁ గృ... 72

మ. అదనం బొద్దులనీడచందమున నిచ్చల్ సృక్కి దుష్టాత్మసం
పద పెంపై ధరనిల్వదించుకయు సౌభాగ్యప్రభాభాసియై
పొదలున్ మాపటినీడకైవడి భవత్పూజావిధేయజ్ఞుఁడై
సదయుం డైనను లేమి జేకురునె కృ... 73

శా. కీడున్ మేలును వచ్చుఁ గర్మవశతన్ క్రీడాగతిన్ జోకలై
వాడల్ వచ్చును బండ్లునొక్కెడధర నొక్కప్పుడున్ బండ్ల
పై, వాడల్ నోఁగద దేశకాలగతి శీతోష్ణంబు లీరీతి నే
జాడన్ వచ్చును దుఃఖసౌఖ్యములు కృ... 74

శా. అంతశ్శత్రుల గెల్వలేరు మమతాహంకారము ల్మానలే
రింతే మూర్ఖము వీడలేరు భవదీయాంఘ్రిద్వయీచింతనా
చింతారత్నముఁ గానలే రిలను దుశ్చిత్తు ల్వృథా వేదవే
దాంతంబుల్ చదువంగ నేమి యగుఁ గృ... 75

శా. నానావేదపురాణశాస్త్రముల నానందింపఁగా నిత్య మిం
పౌ నార్యు ల్వినుతింప ధార్మికరహస్యంబు ల్విన న్వచ్చునో
మీనామాంకభవద్వివేకులకు మున్నాశ్చర్యమే సత్వరా
జ్ఞానాధిక్యము గానిముక్తిఁ గని కృ... 76

శా. గట్రాలన్ బలుకానలన్ గుహల గంగాసింధు దేశంబులన్
వట్రాతావుల దేహమెల్లఁ జెదరన్ వర్తించినన్ మేరువున్
చుట్రా యేఁబదిమార్లు మెట్టినమనశ్శుద్ధుండు గాకుండినన్
చట్రా వాని ప్రయాస మంతయును గృష్ణా దేవకీనందనా.

శా. గంగాజన్మపదాబ్జమందు నభిషేకంబు ల్సదా గాంచెదన్
నంగారార్చనచేసి యేరణమునన్ నర్పింతు నంభోధరా
శృంగారాధిప కౌస్తుభాభరణ యేశృంగారముల్ జేతుమీ
కంగీకారము గాఁగ నాతరమె కృ... 78

మ. అతిమోహాంధులఁ బాపకర్ముల మహాహంకారులన్ దోషదూ
షితులన్ గర్వితదుర్విచారులఁ బ్రశంసింపం బ్రశంసింపఁగా
దితిపర్యాప్తిదినంబు లొంది త్రిజగద్విఖ్యాతియుష్మత్పము
న్నతసేవాభిముఖుండ నైతి నిట కృ... 79

మ. పలుమాఱున్ ఇహభోగకాంక్షపథలన్ పాండిత్యముల్ నే
యువా, రలయజ్ఞానము మాన్పఁగాఁ గలదె యెట్లైనన్ బ్ర
కాశించుకో, మలదీపాళిఁదొలంగఁ ద్రోయునె భవన్మాయాం
ధకారంబును, జ్వలితానందమయస్వరూపయుత కృ... 80

మ. ఉర్వింబాఱుమహానదీజలము లాయూరూరునం దెల్లఁ గూ
డురుఘోషంబున వంకలై కలియఁగా యోగ్యంబులైనట్లు
మీ, స్మరణన్ నానుడువుల్ సదాశుభములై సంపూజ్యముల్
గా భవ, చ్చరణంబుల్ మది నిల్పి కొల్చెదను కృ... 81

శా. బాలక్రీడలఁ గొన్నినాళ్లు పిదపన్ భామాకుచాలింగనా
లోలాభ్యున్నతిఁ గొన్నినాళ్లు మఱియిల్లున్ ముంగిలింగొన్ని
నా, ళ్లీలీలన్ విహరించితిన్ సుఖఫలం బెం దేనియున్ లేదుగా
చాలన్ నీపదభక్తిఁ జేసెదను కృ... 82

మ. మతిలో మిమ్ముఁ దలంచుపుణ్యుఁడిలఁ దా మాయన్ స్వదారా
దుల, న్వేతలంబొర్లఁడు భాగ్యవంతుఁడగు కేవిన్ దివ్యమృష్టా
న్న సం,గతిలో నాడిమనుండు భిక్షమున నొంసంగన్ నేర్చునే శూ
లభృ,చ్చతురాస్యప్రముఖామరప్రణుతకృష్ణా దేవకీనందనా.

శా. అన్నంబైనను వస్త్రమైనఁ దగుతోయంబైన నభ్యాగతుల్
కన్నాకొంచిన నేమియు న్నిడక యేధర్మంబునుం జేయకే
యున్న న్నారకుఁడుండు జీవశవమర్త్యశ్రేణి యిద్ధాత్రిలో
చన్న న్నేమగు నేమగున్ గలుగఁ గృ... 84

శా. ప్రారబ్ధానుభవంబు సేఱ నపవర్గప్రాప్తి లేదండ్రుగా
ధీరశ్రేష్ఠు లనంతకోటులిఁక నైతే వారికర్మంబులున్
ప్రారబ్ధంబులు గావె ముందఱకు నో భావజ్ఞ సైరించి నా
ప్రారబ్ధంబులఁ దీర్పవే కరుణఁ గృ... 85

శా. శ్రీజన్మప్రభుతావిశేషుఁ డగు రాజేంద్రుండు ధీపాలనా
జ్ఞాజాగ్రత్త్వనిదానకీర్తియుతరక్షాలక్షణాధీశుఁడై
రాజిల్లుం బహుకష్టుఁడైన ధరసామ్రాజ్యంబు పాలింపుచో
నైజంబై తగు నా విశేషములు కృ... 86

మ. సమరద్వేషులసంగరాంగణమునన్ సాధించి సామ్రాజ్యసౌ
ఖ్యముఁ దాఁ గాంచి సహించి చొప్పడు వివేకప్రాజ్ఞతల్గాంచు భూ
రమణశ్రేష్ఠుఁడు నావకానుచరుఁడై రాణించు శిక్షించు దు
ష్టమతి భ్రష్టమదాంధశత్రువుల కృ... 87

మ. విగతక్లేశులు వీతకిల్బిషమయుల్ విజ్ఞానవిద్యానిధుల్
నిగమార్థజ్ఞులు నిశ్చలవ్రతయుతుల్ నిర్వ్యాజనిష్ఠాయుతుల్
సుగుణుల్ సూనృతవర్తనుల్ శుభకరుల్ శుద్ధాంతరంగుల్
శుభుల్, జగతీమండలి నీదుసేవకులు కృ... 88

శా. దీనుల్గల్గిన నీదురక్షణగుణాధిక్యంబు రాణించు నా
దీనుండెవ్వఁడు లేఁడు నీదు కరుణాదృష్టిన్ గృతార్థుల్ జేయ
నేనే దీనుఁడ నన్నుఁ బ్రోవు శరణంటిం దన్ముఖోదీర్ణసు
జ్ఞాన శ్రీకరమూర్తి నమ్మితిని కృష్ణా దేవకీనందనా. 89

శా. పాత్రాపాత్రవివేకము ల్సమసె పాపం బెచ్చె ధర్మంబునున్
మిత్రఘ్నత్వముకల్లలాడుటయు స్వామిద్రోహముం గొండె
ముల్, ధాత్రిం బూజ్యము లయ్యె సజ్జనులచందం బెట్లు
రక్షించెదో, సత్రాజిత్తన యామనోరమణ కృ... 90

మ. అరయం జందనగంధిపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలకునిపై నందవ్రజస్త్రీలపైఁ
బరఁగంగల్గు భవత్కృపారసము నాపైఁ గొంతరానిమ్ము మీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ హరి కృ... 91

మ. అనుకూలాన్విత యైనభార్యయును ధర్మార్థంబునై నట్టి నం
దనులున్ సజ్జనులైన సోదరులు నెన్నంగల్గు సంపత్క్రియా
ఘనుఁడై నట్టి మహాసుభావుఁడె భవత్కారుణ్యదృగ్జాలభా
జనుఁ డప్పుణ్యుని జూచినన్ శుభము కృ... 92

మ. శరణాగత్యనురక్తి భక్తి జనరక్షాసత్కృపాసేవ్యస
త్కరుణాపూరసుధారసంబుగలశృంగారంబు మీమూర్తి
యుం, దరణోపాయ మెఱుంగలేని కలుషాధారున్ ననుం
దావక, స్మరణాధీశునిఁ జేయు మ్రొక్కెదను కృ... 93

మ. ప్రలయాభీలకరాళదావదహనప్రజ్వాల మబ్జోదరా!
జ్వలనాకారముదాల్పఁ దానియెదుటన్ సంతప్తసంతాపవాం
ఛలు దివ్యుల్మునులుం గృశాస్యులగుచుం జల్లార్పఁగా లేక ని
చ్చలు నీపాదములే భజించెదరు కృ... 94

మ. మొఱయాలింపవొ మానమున్నిలుపవో ముల్లోకమేలింప
వో, మఱివీయంచును వెంటనేతెరుగవో మన్నింపవోయం
దుమో, కరినో ద్రౌపదినో సురాధిపతినో గాండీవినో యె
వ్వఁడన్, ధర నిన్ గొల్చినవారిలో నొకఁడ కృ... 95

మ. కుటిలారాతినిశాటకోటికదళీకూటాటవీభంజనో
ద్భటమత్తద్విపకేళిలోలము సముత్పాప్రవీణ్యదైత్యాంగనా
స్ఫుటముక్తామణిరత్నహారతిలకాపుంజాతలూనక్రియా
చటులజ్వాలము నీసుదర్శనము కృ... 96

మ కులిశానేకసహస్రకోటినిశితక్రూరోరుధారాముఖా
కలితార్చిప్రభవప్రభావత్రిజగత్కల్యాణసంధాయియై
విలసిల్లున్ భవదీయచక్రమఖిలోర్వీభారనిర్వాపణో
జ్జ్వలనిర్వాహపరాక్రమక్రమణ కృ... 97

మ. అతికాకోలకరాళకాళియకఠోరాశీవిషావిర్భవ
క్షతినోనాటిన నాఁటిపాటు తలఁపన్ శంకించి యుంకించె దో
సతతో ద్వర్తులవర్ణసర్వభయదాంచత్పంచచూడావతం
సతతం గారుడకేతనోద్ధృతియు కృ... 98

శా. నక్రోదగ్రతఁ బ్రాణవాయువులు మేన న్నిల్వఁగా నోపవో
చక్రి న్నన్ దయ గావుమన్న కరుణన్ జాజ్వల్యచక్రంబుచే
నక్రంబుం దెగఁ జూచి కాచితిగదా నాగంబు వేగంబునన్
శక్రాద్యామరవందితాంఘ్రియుగ కృ... 99

మ కరి నేలింది వాళ్ళకిక్కా ద్రౌపదికి కోకల్ మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్నన్ బగవానితమ్మునికి రాజ్యం బిచ్చుట ల్కల్ల యి
త్తఱి నన్నేలిన నిక్క మీకథలు కృష్ణా దేవకీనందనా.100

ఈకృష్ణశతక మెప్పుడు
పైకొని విన్నట్టివారు వ్రాసినవారల్
చేకొని పఠించువారలు
శ్రీకృష్ణునికరుణ కలిగి చెలఁగుదు రెలమిన్. 101

దే వ కీ నం ద న శ త క ము

సం పూ ర్ణ ము.



చెన్నపురి : శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1934.—750.

# ఆంధ్రగ్రంథములు.



| | | ప్రతి 1_కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 8 |
| అప్పకవీయము, చక్కనిముద్రికము | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, చక్కనిప్రతి | ... | 5 | 8 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 సంపుటములు | ... | 7 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 1 |
| ఆంధ్రభారతము, 7 సంపుటములప్రతి | ... | 14 | 0 |
| డిటో 3 సంపుటములప్రతి | ... | 13 | 0 |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 2 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 2 | 0 |
| శాంతిపర్వము | ... | 2 | 0 |
| అనుశాసనిక, ఆశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 3 | 12 |
| శాంతిసప్తకము | ... | 3 | 12 |
| ఆంధ్రభారతవిమర్శనము | ... | 0 | 8 |
| ఆదిపర్వము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 . | 8. |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము - కావ్యతీర్థ జనమంచి శేషాద్రిశర్మ గారిది, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్ర బ్రహ్మాండపురాణము | ... | 5 | 0 |
| ,, బ్రహ్మపురాణము | ... | 4 | 0 |
| ,, లలితోపాఖ్యానము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 4 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, సాంబనిఘంటువు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము | ... | 1 | 8 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 14 |
| కవిసంశయవిచ్ఛేదము | ... | 0 | 6 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| డిటో కాలికో | ... | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 6 |
| డిటో కాలికో | ... | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము | ... | 0 | 8 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | ... | 7 | 8 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిది | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 4 |
| చెన్నబసవపురాణము | ... | 1 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| జైమినీభారతము, కాలికోబైండు ... | 1 | 6 |
| తెనుఁగుసమస్యలు ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము ... | 2 | 0 |
| దసరాపద్యములు ... | 0 | 1 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద, కాలికో ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 1 | 0 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 4 |
| నృసింహపురాణము ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, పద్యము, కేతనకవిది ... | 1 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు ... | 0 | 8 |
| „ సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బసవపురాణము ... | 2 | 4 |
| బ్రహ్మోత్తరఖండము ... | 1 | 0 |
| భాస్కరరామాయణము ... | 4 | 0 |
| భోగినీదండకము ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 2 | 0 |
| మూన్నాళ్లముచ్చట, వే॥ ప్రభాకరశాస్త్రి ... | 0 | 4 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 1 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మొల్లరామాయణము, చిన్నసైజు | 0 | 10 |
| యయాతిచరిత్ర | 0 | 12 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | 0 | 3 |
| రసికజనమనోభిరామము | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద | 2 | 8 |
| రంగరాయచరిత్రము | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక | 2 | 0 |
| రాజయోగసారము, ద్విపద | 0 | 4 |
| రాజశేఖరవిలాసము | 0 | 8 |
| రామరాజీయము, చక్కనిప్రతి | 0 | 12 |
| రామాభ్యుదయము | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, కాలికోబైండు | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | 0 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | 0 | 10 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక | 1 | 4 |
| వసుచరిత్రవిమర్శనము | 1 | 0 |
| వసుచరిత్ర, సటీక | 4 | 0 |
| వసిష్ఠజనకసంవాదము | 0 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | 1 | 4 |
| వేంకటాచలమాహాత్మ్యము | 1 | 4 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | 0 | 6 |
| బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | 1 | 4 |
| ,, (2728) చిన్నసైజు | 1 | 12 |
| ,, 2728 ఆంధ్రతాత్పర్యముతో | 3 | 8 |
| విజయవిలాసము, కాలికో | 0 | 12 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | 0 | 5 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| నారాయణశతకము, పోతనకవిగారిది | ... | 0 | 4 |
| నృకేసరిశతకము, శేషాచలదాసుగారిది | ... | 0 | 2 |
| భద్రగిరిశతకము, భల్లా పేరయకవిది | ... | 0 | 3 |
| పార్థసారథిశతకము, పానకాలరాయనిది | ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పావులూరు మల్లన | ... | 0 | 2 |
| డిటో (వేదాంతము), పరశురామ నరసింహదాసు | ... | 0 | 4 |
| యాదగిరీంద్రశతకము, టి. వేంకటకవిది | ... | 0 | 2 |
| రమాధీశ్వరశతకము | ... | 0 | 2 |
| లక్ష్మీశతకము, పరవస్తు మునినాథకవిది | ... | 0 | 2 |
| లావణ్యశతకము | ... | 0 | 4 |
| వసుదేవనందనశతకము, వె. రంగయ్య | ... | 0 | 4 |
| వీరనారాయణశతకము | ... | 0 | 2 |
| శ్రీశైలమల్లేశ్వరశతకము | ... | 0 | 2 |
| శిఖనరసింహశతకము (శకునశాస్త్రము) | ... | 0 | 4 |
| శ్రీనివాసశతకము | ... | 0 | 2 |
| సర్వలోకేశ్వరశతకము | ... | 0 | 2 |
| సూర్యనారాయణశతకము | ... | 0 | 2 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | ... | 0 | 2 |
| మహిళామనోహరశతకము | ... | 0 | 2 |

## నీతిశతకసంపుటము—౧

ఇందు 1 సుమతి, 2 భాస్కర, 3 వేంకటేశ, 4 గువ్వలచెన్న, 5 చంద్రశేఖర, 6 వేమన(పద్యములు), 7 శరభాంకలింగ, 8 కుమార, 9 కుమారీ, 10 కోలంక శ్రీమదనగోపాల, 11 నీతి, 12 జగన్నాయక, 13 కుక్కుటేశ్వర, 14 రామలింగేశ, 15 నమశ్శివాయ, 16 బాలనీతి, 17 రామచంద్ర, 18 కృష్ణనీతి, 19 మానినీ, 20 రఘురామశుభోదయశతకములు గలవు. వెల రూ. 2 0

## నీతిశతకసంపుటము—౨